

శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు.

# శ్రీ భారతార్ణవలఘుబోధిని.

## ఆదిపంచకము ప్రారంభము.

——:o:——

హిందూస్తానిమెట్టు - తోహర.

శ్రీవనితాధవునమ్మనబ్రోల్పురశ్రీహరినిదలంచి - విధిమహా - దేవులస్మరియించి - హైమవతి - దేవినిమదినెంచి - నుతించి - భావమునన్ గణపతిగజాననునిభక్తిమీరపూజించి ॥ మధుసూదనుకోడలుగీర్వాణినిమదిలోపలనెంచి - వాల్మీకుల - పదములుసేవించి - వ్యాసనుతి - ముదమునగావించి - ధరాస్థలి - ప్రథమాంధ్రకవీంద్రుడగునన్నయనుభావమునన్గీర్తించి ॥ కమ్మకులపయోధిపూర్ణశశిక్రిష్టమ్మకుమారుడనూ-నాగినే - నిమ్మువంశజుడను - పదకవి - త్వమ్ముజేసినాను - భక్తవర - తమ్మికంటిదయ వేంకటకవియనిదనరువాడనేను ॥ పంచమవేదంబనబరగినయీభారతకథజూడ - మహాంబుధి - గాంచుటకిదివోడ - గానునే_కుంచిసేయువాడ - పూర్వకృత - సంచితఫలమున్మించిదనుచును రచించబూనీనాడ ॥ శౌనకాదిమౌనేంద్రములు నైమిశకాననమునజేరి - పుణ్యకథ - వీనులవినగోరి - భారతవి - ధానంబేదారి - దెల్పుమన - తానుగ్రశ్రవసుండనుసూతుడుతత్కథదెల్పెనమీరి ॥ ధారుణి ధృతరాష్ట్ర పాండువిదురులుధరణిపతులుగలరు - పాండుసుకు - మారులేవురలరు- ధృతరాష్ట్రకు - మారులునూరువురూ - వారలా - పారవారసమధీరులుహస్తిపట్నములోగలరూ ॥ క్షితిపతియగు ధృతరాష్ట్రకుమారులశతవితతియుగూడి - జలక్రీ - డతులితముగనాడి - పాండుసుతు - లతోచెతురతనాడి - వాయుసుతు - డతులశక్తితన్నులకానూర్వురధృతరాష్ట్రినిసుతులోడి ॥ గాపాటుసుగనిదుర్యోధనుడతికోపవంతుడాయెన్-

పవనసుతు - యీపుమాపు సేయఁగ - నెట్లులని - తాపమెక్కువాయఁగ -
సుయోధను - తాపసహితులగుపాండవులనుగని - తాసహింపఁడా
యెఁగ ॥ యేతెరగునైనవీరలజంపీభూతలమేలెదనూ - నేనువి - ఖ్యాతి
గాంతుధరను - భీమునిఁ - ఘాతజేసెదాను - మనంబున - పాతకమనిద
లచనువీరలనేపాతిపెట్టెదాను ॥ కూరులువిషమిడియన్నముబెట్టినసా
రమంటదాయె - జీర్ణమై - మేరుధీరుడాయె - భీముడే - తీరుజావడా
యె - సుయోధను - డేరీతిగవీరలజంపెదనని యెక్కువమచ్చరమాయె ॥
ద్రోణాచార్యులువారందరికినిబాణవిద్యజెప్పి - నామదిఁగ - బూనుయిష్ట
మొప్పీ - తీర్చువా - రీనిజెప్పుడిప్పి - శూరులీ - శ్రేణిలోనెవరనకౌరవుల
దివినిబూనవైరితలద్రిప్పి ॥ ఆమాటలువిని వాసవనందనుడతిశౌర్యము
తోను - గురువరనీ - ప్రేమదీర్చెదాను - చూడునా - సామర్థ్యముతో
ను - సురేంద్ర - స్తోమంబెమరేగినగెల్చెదననజూచిద్రోణుడిట్లనెనూ ॥
యోర్చిశౌర్యముననాయభీష్టమునుదీర్చెవాడవురా - ద్రుపదునినే - దెచ్చి
పట్టితేరా - శూరులనే - దీర్చెవాడవుగా - యర్జునా - నేర్చుమునావిలు
ద్యనెల్లనీకిచ్చెదగైకొనరా ॥ నరుడాద్రోణునిమాటలువినితానతిరయ
మునపోయెఁగ - ద్రుపదుడా - పురిలోనెదురాయెఁగ - ఫాల్గుణుడు సర
కుసేయడాయెఁగ - ద్రుపదునిం - గురుదక్షిణగాబట్టితెచ్చితా గురునికో
రెక్కబాయఁగ ॥ కకర్కశమునదుర్యోధనాదులొకలక్కయిల్లుగట్టి - పాం
డవుల - నక్కడుండపెట్టి - యింగలము-నొక్కరాత్రిబెట్టి - వారలను-చ
క్కసేయుమనిపురోచనుండనుటక్కరినక్కడబెట్టె ॥వృల్లమునసుదుర్యో
ధనకృత్యంబెల్లతానుదెలసి-విదురుని వల్లవీరుదెలసి-భీముడా యిల్లుగా
ల్చివేసి - సిదురలో - తల్లినన్నదమ్ములనుదీసుకొని - తర్లెనానగరుబాసి॥
పదపడిచిక్కడవికిభీముడుతాగదలివచ్చెనపుడూ - హిడింబా - సుదతి
గూడెనపుడు - హిడింబుని పాదమణంచెనొకడు వడముడి - కదనము
రౌదపినికుంతికుమారులునిదురలేచిరపుడు - భూసురులుండేయేకచక్ర
పురవాసముగాపించి - భిక్షప్ర - సాదముభక్షించి - బ్రాహ్మణుని ఘో
షనాలకించి భీముడ గ్రోషునిబకాసురునివధించి యాభూసురురక్షించి॥
సుయోధనుడు పాంచాలరాట్తనయస్వయంవరమునోడి - రసపినియు-

రయంబుననుక్రీడి వెళ్లిమ - త్స్యయంత్ర తెగనాడి - పాండుసుతు - ల
యింతిపెండ్లాడి - వచ్చిరా - పయోజముఖిహస్తియానద్రౌపదివయారి
నేవురుగూడి ॥ స్వస్తిప్రమత్తై పాండుకుమారులుహస్తిపురముజెర - మ
హీసుర - యిష్టసఖులజెరి - మురారి - నేస్తమునమీరి - ధర్మగుణ - ని
స్తంద్రులువారేవురునింద్రప్రస్తపురముజెరి ॥ విహ్వచ్చుడుతాతీర్థయాత్ర
జనిమువ్వురపెండ్లాడి - సుభద్రా - జవ్వనితోగూడి - వచ్చితా - నవ్వ
లహరిగూడి - యగ్నికా - కివ్వడి కాండవదహనమిచ్చె పాకారిసురలపో
గాడి ॥ జయప్రదుండగువిజయునకింద్రుడునయంబుననువచ్చి - సంగర
వి - జయుండవనిమెచ్చి - దివ్యశర - చయంబులనుయిచ్చి - బనుపగా - ప
యోజనాభుండర్జునుడింద్రప్రస్తపురముకొచ్చి ॥ అష్టైశ్వర్యంబులతో
సుండినయపుడొకసభదెచ్చి - మయుండుయు - ధిష్టురునకునిచ్చి - దీనిధ
ర్మిష్టులునివసించి - యుండగా - దుష్టులకీసభనిజమదృశ్యమనిస్పష్టము
గాసూచించి ॥ మయుడిచ్చినసభజెరినారదునిమాటలుతావినియు -
రాజసూ - యయాగంబువలయు - సకలభవ - చయముబాపవలయు
బావయగు - పయోజనాభునిబిలచియాగమునుబాగసేయవలయు ॥ అ
నికృష్ణునిబిలచియుధర్మజుడపుడాయాగముసేయక - జరాసం - ధుని
వధించుటాయెక - శిశుపా - లనువాడిట్లనియెక - ధర్మజుని - గనిధరసు
రలావనిపతులుండగయవివేకంబనియెక ॥ యాదవకృష్ణునిపూజించుట
నీయవివేకముగాదా - విప్రతతి - నాదరించరాదా - మహాభూ - నాథు
లుండలేదా - యుధిష్టర - యాదనుజారినిపూజించుటనీవెర్రిబట్టిగాదా ॥
అనికృష్ణునిదూషించినశిశుపాలునిగనిధర్మజుడు - కృష్ణుని - ట్లనకుమహా
ఘనుడు - జగద్ర - క్షణుడుసర్వసముడు - మాధవుడు - వనజాసనమర
పార్వతీశ్వరులవరమానసప్రియుడు ॥ యాదవుడనిదూషించదగదనిన
వాదమాడమించి - నట్టియా - క్రోధాత్మునిగాంచి - మురారి - క్రోధం
బునవచ్చి - శౌర్యమున - తాదూషించినశిశుపాలునియాంతక్షణమెవధిం
చి ॥ నప్పరాత్పరునిగనిపాండవులపుడతిమోదముతోను - మ్రొక్కి
మం - మెప్పుడుదయతోను - బ్రోవుమన - తప్పకవిసితాను - కృష్ణుడనె-
నప్పామిమ్మెప్పుడురక్షించెదననియాధర్మజుకనెను ॥ అంతటకృష్ణుండ

రిగినపిమ్మటనాసుయోధనుడును - తత్సభా - వింతగాంచుటకును -వచ్చి
యొక - కొంతనిగానకను - పంకమున - వింతగపడగనిద్రౌపదిభీముడు విక
వికనవ్వగను ॥ లజ్జవోయిచనిదుర్యోధనుడుల్లాసమువదిడించి - వేసీత
న - సజ్జనుబవళించి - యున్నయా - లజ్జశకునిగాంచి - సుయోధన-యి
జ్జగంబునేలుచునిట్లుండగనేమితకుల్ వదలంచి ॥ జూదమాడిగెల్పించె
దలెమ్మనిసుయోధునెకొల్పి - శకునిలే - పోదమనుచుదెలిపి - ధర్మజుని
జూదములోనిలిపి - కపటకృత - సాధుమానసుడుధర్మజుమోసలనుశకుని
పాచికలుదొలిపి ॥ యీసారెవరోడినపన్నెండేళ్లకవత్సరమును - అర
ణ్యాని - వాసముండవలెను - శభాసని - వేసిరిపందెమును - ధర్మజుడు-భా
సురాంగిద్రౌపదినేవురతారోసంబుననోడగను ॥ యుభయులుజూడగ
ద్రుపదపుత్రినీసభకిటుదెమ్మనెను - సుయోధను - డభయంబివ్వగను-ద్రౌ
పదిన్ - రభసముసేయుచును - దుశ్శాసను - డీభరాడ్వరదాయసుద్రౌ
పదిసతినీడ్చిదెచ్చియాసభనూ ॥ యెన్నివలువలొల్చినద్రౌపదిసతికేక
వస్త్రముండు - పాండవులు - కిన్నలగుచునుండు - సుయోధను - చెన్న
లరగనుండు - ద్రుపదసుత - వెన్నునిదలచుచుబ్రోవుమనుచు మదివేడుకొ
నుచునుండు ॥ దుష్టచరిత్రునితోజూదంబుయుధిష్టరుడాడియును - గెల్వ
లే - నష్టకాలమునను - వలదనుచు - నిష్టులుజెప్పినను - వినకతా - మ
హైశ్వర్యంబులోడిపాండవులారణ్యముజేరగను ॥ మానిశిఖామణిబ్ర
హ్మర్షి యునగుశౌనకుడేతెంచి - దండధర - సూనునిగనిమంచి - మా
ర్గమును - వానికిబోధించి - దిగులువి - జ్ఞానివొందకుండుననియుకర్మాక
ర్మంబులనెరిగించి ॥ మానసమునఃఖజలంబులువిమలజ్ఞానవహ్నిలోను -
గలపిశో - కాసివహముమాను - జగద్భ్రమ - లోనుమాయమేను - స్వ
ప్నమని - శౌనకుడరిగినసూర్యోపాసనబూనిజేసియమసూను ॥ వర
ములుగైకొనిపాండుకుమారులువనములోపలాను - శాకముల్ - తరు
ణివండగాను - బోనమా - రగురునుగుడుచుచూను - గహనమున - పరమ
ధర్మబంధమునగట్టువడిపాండవేయులుండగనూ ॥ కిరాతవేషముధరిం
చివచ్చినవిరూపాక్షునితోను - కవ్వడిబ - వరముసల్పగాను-శివునిజ-స్వ
రూపుగాగ్గాను - ఫాల్గుణుడు - హరానందివాహనాశివాయనిస్మరించె

మానసమునను ॥ మెచ్చి శివుడు పార్థునకు పాశుపత మిచ్చె బాణ మొస
గెన్ - లోకజయ - మిచ్చి భవుండరిగెన్ - యఖండులు - డొచ్చి క్రీడినడి
గెన్ - వలయు శర - మిచ్చె దరన్నునియమరావతీపురి కిర్వురరదమునజరి
గెన్ ॥ నరుడమరావతి కేగినయూర్వశిమరులు జెందగాను - యర్జును
డు ధరుసగాచుమాను - మనినయూ - తరుణికోపమున నూ - వేశ్యసతి
నపునినపుంసకుని గాశపించిన పురందరుండంతటనూ ॥ నరుని గనుంగొని
యూర్వశిశాపమెవరికి దప్పదనెనూ - యేకవ - త్సరాజ్ఞాతమునను -
యుండి వెను - కరుగు శాపమనెను - దయమాడన్ - పరసుతునకు దివ్యా
స్త్రములిచ్చిననరుచేకొని వచ్చిననూ ॥ నిర్మలమానసుడగు బృహదశ్వము
నీంద్రుండొచ్చియును - వినయమున - ధర్మజుకిట్లనెను - కౌరవులు - దు
ర్మానసులనెను - దైవకృత - కర్మఫలంబనుభవింపవలెనేఘనునకైనగా
ననెనూ ॥ యిలనుకష్టసుఖము లెవరికైననుగలవు ధర్మరాజా - మున్ను
శని - వలనానలరాజా - యెన్నియిడు - ములబడెరవితేజా - దిగులు
మది - వలదుమహారిచ్చంద్రునకెంతాపదగలిగెయమతనూజా ॥ అనిబృహ
దశ్వుడరిగినమార్కండేయుడు చనుదెంచెన్ - ధర్మజుడు - గనుగొని
పూజించెన్ - మహాత్మ - మునులని వినుతించెన్ - మునీంద్రా - ధనహి
తరాజ్యవిహీనులమైయిటుతగనికష్టములువచ్చెన్ ॥ అనిపలికినమునిధర్మ
నందనా వినురాముడుతొల్లి - భూసుతన్ - గనితీసుకవెళ్లి - నట్టిరా - వ
ణునిజంపిమళ్లి - జానకితో - చనుదెంచెను శ్రీరాముడయోధ్యకు సౌఖ్యం
బునవర్తిల్లి ॥ సావిత్రీచందమునద్రౌపదీదేవి భక్తితోను - పతివ్రత - సే
వజేయగాను - కృష్ణుమీ - కావయుండగాను - త్రిమూర్తులు - బ్రోవరెనీ
సత్యమునకు ద్రౌపది బోటికష్టమునకూను ॥ కృతయుగంబునందు ధర్మదే
వతచతురాంశంబులను - త్రేతయుగ - త్రితయాంశంబులను - ద్వాపర
ము - ద్వితియంశంబులను - ధర్మమిటు - ప్రతియుగంబునందు తరుగు కలి
యుగప్రవర్తనంబావలను ॥ నిలచుపాదమాత్రావశిష్టమై కలియుగ ధర్మ
మును - యల్పవి - ద్యలమోహంబునను - యొకరిమా - టలను మెచ్చరిక
నే - గగనమున - సలిలహీనమేఘములు జనించును సస్యఫలహతంబుగ
నూ ॥ నరులుకలియుగంబునకులాభిమానములనెంచరికను - వర్ణసం-

కరముసేయబూను - దురుసుహీ - సురవాణిజ్యమును - గల్గునని - యరి
గెనుమార్కండేయసుహాముని యాపాండవులంతటను ॥ వనవాసముజె
యుచుండిద్వాదశవత్సరాంత్యమునను - కర్మవిధి - యనుభవించవలెను
తప్పదని - యనుమానించకను - పాండు నం - దనులజ్ఞాతముసల్పగవెడ
లిరినయమార్గంబుననూ ॥ నట్టడవినిగైదువులుజమ్మిపైకట్టకట్టిపెట్టి
దానికిఁ - గట్టితోలుజుట్టి - శవంబును - బట్టిపైనబెట్టి - పాండవులు -
గుట్టుగనజ్ఞాతముసల్పేదికనెట్టులనుచుమదిదట్టి ॥ నగోచరముగచరిం
చిమత్స్యపతినగరికేల్లుజనను - తమ్ములను-మగువనెంచితాను - ధర్మజు
డుదిగులుజెందగాను - సోదరులు - వగవకుమన్నామారువేషములవనిప
తిగొలిచెదమనెను ॥ సన్యాసివేషమునధర్మజుడుచయ్యనరాగనెను - వి
రటుడా - పుణ్యునిబిలచియును - యిచ్చటని - పుణ్యముండుమనెను-సం
మ్మతిను - సన్యాసముగాధర్మజువిరటుతోపచీసాడుచుండగనూ॥ వంటల
వాడైవిరటునిగొల్వనువడముడిచనుదెంచెఁ - మత్స్యపతి - కంటగని
వచించెఁ - నీవుమా - యింటనుండమించుఁ - మోదమున - వంటలాం
డుచునుపిరటునిగృహమునవలలుడుతానివసించెఁ ॥ క్రీడిబృహన్నలన
నివిరటునిపురికేతెంచెనుచూడ - చిత్రముగ - నీడనుండువాడ - ననినవా
మేడనుండుమీడ - విరటుడన - పేడిరూపమునరాకన్నియలకుపాడనాడ
నెర్పాడ ॥ నకులుడశ్వపాలకుడైవిరటునినగరుజేరితాను - యశ్వశి -
క్షకుండననగాను - మత్స్యనా - యకుండతనితోను - యుండుమన -
చకచకాయనడలునేర్పసైంధవశాలనుండేమేల్గాను ॥ పశులగావసహ
దేవుగోపవేషముధరించిరాగ - మత్స్యపతి - వశమతీశువలెగా - నె
న్నతా - పశులగాతుననగా - విరటుడా - రసికునిపలుకులకునుకుశ
లుండైపశులగాయుమనేబాగా ॥ సైరంధ్రివేషంబునద్రుపదజసరోజా
క్షివచ్చెఁ - సుదేష్ణను - కురంగాక్షిగాంచెఁ - దాసికృత - విరుల్ప
నివచించెఁ - మోదమున - విరాటరాజమహిషీసుధేష్ణతానింటనుండ
నియమించెఁ ॥ అంతట కీచకుడొకనాడు సుధేష్ణకయింటికొచ్చెఁ -
సైరంధ్రి - కాంతనుమోహించెఁ - సింహబలు -డింతినడుగమించెఁ
ద్రౌపదీ - కాంతఁ కీచకునింటికిసుధేష్ణకల్లుదేరబంపించెఁ ॥ యోచిం

చియువోవకతీరదనియుకీచకునిలుజేరి-కల్లునూ- రా చెలిపదిగోరి- తెం
మనిన - కీచకుతమిమీరి - రంమ్మనిన - నీచుడనీకిది తగునాకీచకరాచధ
ర్మమునుమీరి ॥ అనిసైరంధ్రిహరినిదలచుచునచటనుండిపోగా - కీచకుడు
వెనుకబట్టపోగా - దైవపను - పునదనుజుడురాగ - మూర్ఛిలిన - మన
మునకీచకుడుండగద్రౌపదివనితామణిజనెవేగా - వలలునిసదనంబున
కరుదెంచినలలనామణిగాంచి - వలలుతన - కులసతిగానెంచ్చి - యెం
చుకీ - స్తలమునకేతెంచి - నావనిన - తెలిసియునన్నుఘటవుఁరచితివ
నివెలదిమదినిచింతించి ॥ నాధాయేమనిదెల్పుమకీచకునక్కకల్లుదేర -
సింహబలు - సౌధముజనక్కూర - కోరనా-నాథులకునుమీర - ననిన
యా - సాధుపల్కనన్బట్టవచ్చెజనిచంపుకీచకునిశూర ॥ యీలాగునబ
లిక్కనవినివలలుడుయాలోచనతోను - ద్రౌపదీ - లోలనయనతోను -
నిశీథివేళలోపలాను - నర్తనవి - శాలకుకేసరిబలునిబిల్వనేచక్కాడె
దననగాను ॥ అంతటకీచకుడాసైరంధ్రికాంతనుమోహించి-సంతతము
నింతినిజింతించి - తాపమున - కంత్తునిదూషించి - సైరంధ్రి - దంతిగ
మనరమ్మనిపిలచినయాతరుణికోపముడిగించి ॥ వలదనిజెప్పినవినవని
ద్రౌవది - వలపుగతలవంచెన్ - కీచకుని - పలుకులాలకించెన్-నర్తన
న - స్తలముకురప్పించెన్ - వచ్చితా - వలలునికెరిగించినచనిబిరానబ
లకీచకునివధించెన్ ॥ అతివలవలలోజిక్కినవారలగతియీలాగాను -
స్త్రీలభ్రమ - వెతపృగతృష్ణాను - స్వాకృత - సతులుగుంపగాను - వు
దినిపర - సతితతిగోరినజారులకెప్పుడౌనృతియీలానిజమౌను ॥ పా
తకసుయోధనాధులువిరటునిపట్టణంబులోను - పాండునృప - జాతులుం
డగాను - వారిక - జ్ఞాతభంగమూను - సేయుటకు - యాతతగోతతి
బాదివినబృహన్నలపుత్తరునకుతాను ॥ సారథిగాకురుసైన్యముమీద
కుచనుదేరంతటనూ - యుత్తరుడు - కౌరవులనుగనెను - అర్జునా-శూ
రులెవరోయనెను - కురువర - ధీరులుత్తరాయనికవ్వడిసదాఱరు జెప్ప
తావినెను ॥ ఉత్తరుడత్తరివణకిరథంబునతత్తరిల్లిథుమికెన్ - నేనుమ
ల్లొత్తుననుచునురికెన్ - యజ్ఞనుం - డుత్తరుబట్టురికెన్ - బట్టితె-చ్చి
త్తరినెగెల్చెదరథసారథివీవుగంమ్మనుచుబలికెన్ ॥ సరేననుచుకవ్వడి

మాటలకుత్తరుండు సరగుననను - పార్థునకు - వరసారథ్యమును - సేయ
గా - నరు రాకడగనెను - సుయోధన - బిరానవచ్చెటివాడర్జునుడనిభీ
ష్ముఁడపుడిట్లనెను ॥ పదమూడేఁడులునిన్నటితోసరి పాండుకుమారుల
కు - కష్టము - ల్వాదలెనేటివరకు - వచ్చెనిదె - కదనరంగమునకు - క్రీడి
పుడు - కోదమసింగమాకలితోనశనముగోరివచ్చెనటుజనకు ॥ భీతిమా
టలేలపల్కెదవుచాల్నీతిగాదుమాను - నదీసుత - లేతమాటలేను - వి
ననుపో - సూతపుత్రుడేను - గెల్తుమని - గోతతిబాదివిరికర్ణుసుయో
ధనుకోపావేశంబుననూ ॥ వెడలివచ్చికవ్వడికడువడికురుపేరులడవిలో
ను - చిచ్చుల-పిడుగువలెనుతాను-సాక్రమ్ము-కడురయంబుగాను-వే
యగ౯ - చిడిముడిబడిసాక్కక్కియుకౌరవసేననిద్రవోవగను ॥ యి
క్కురుసైన్యముసొక్కవదలుత్తరదిక్కుకరిగిచూసి-నదీసుతు-నొక్క
నివిడజేసి - తక్కినవి - మక్కువేయొగోసి - తెమ్మనిన - ఘుక్కనతల
పాగాల్గోసుకతేరెక్కనను త్తరుజూచి ॥ నరుగోగణమునుమర్లదోలు
కొనివిరటునిపురిజేరె౯ - వారలుసి - దురదెలసియునదరె౯ - కురుపతి
స - మరమువలదుమీరె౯ - భీష్ముడన - మరలతమపురంబునకాకురుప
తిపిరికిమూకవడితారె౯ ॥ అచ్చటకౌరవశూరులువిజయుండజ్ఞాతము
లోను - వచ్చెనని - యెచ్చరించగాను - భీష్ముడవి - పిచ్చిమాటలనెను -
యజ్ఞాతం - బచ్చటికిరాకమున్నెవెళ్లెననయందరొప్పిరంతనూ ॥ విరా
టాజుతోపాండుసుతులుతామరుగురూపులాను - దెల్పితం - మ్మెరుగ
జేయగాను - మత్స్యభూ - వరుడువేడగాను - విరటసీ - మరుగు
ననజ్ఞాతముసల్పితిమనమత్స్యమహీశుండనెను ॥ నాకోరికలుఫలించెన
ర్జునానాకునూరిసేను - యొసంగెద - గైకొనుమనగాను - విద్యోసగి -
చేకొనదగదనెను - కోడలిది - నాకుమాగుడభిమన్యునకింమని నరుడ
వనీశ్వరుకనెనూ ॥ అభిమన్యునకుత్తరకువిరటుడొకశుభముహూర్త
మునసూ - వివాహం - బభిరామంబుగను - జేసిమహా - విభూతినో
సగగను - బలరాముం - డిభరాడ్వరదుడు కృష్ణుడరుగుదెంచిట్లనెధ
ర్మజుతోను ॥ కపటద్యూతంబాడిరాజ్యమున్నపహరించినారి - భూ
మిపా - లిపుడుమీరుకోరి - సుయోధను - కపాయంబుమీరి - సేయ

కోక - నుపాయసూక్తులమానిసినంపుటయుచితమనెనుదనుజారి ॥ హ
రివాక్యములెస్సనిబలదేవుండాసభలోననెను - కృష్ణపలు - కిరుతెరం
గులకును - మేలుయె - క్రూరునిబంపవలెను - బంపియా - కురుపతి
మదికనుగుణ్యంబుగపాల్గొరియడుగవలెను ॥ సుధర్మరాజోడినరాజ్యం
బునుజూదంబునగెలిచెఁ - శకునితా - యదార్థమాడించెఁ - జూ
దమున - యుధిష్టరునివంచెఁ - కౌరవుల - నధర్ములనుటకుకారణమే
మన - యాసాత్యకికోపించెఁ ॥ యిష్టంబునజూదంబాడిరనుచునిట్టు
లాడమేథా - ధర్మజుని - కష్టపెట్టలేదా - వారునీ - కిష్టులనుచుగాదా -
సుయోధను - కిష్టంబునబోధించినవినునాదుష్టమానసునిమీద ॥ కదనరం
గమునగానివారిపనికుదురదనుచులేచి - దృపదుడా - మధుసూదనుజూ
చి - నామదికి - విదితంబిదితోచి - యున్నదన - మధుసూదనుడాదృపదు
నియోచనమంచిదనెనుతలయూచి ॥ కౌరవులునుపాండవులుమాకొక
టిగానివేరుగాము - సుయోధను - జేరపోవుసాధు - పాండవులు - గోరు
పాలులేము - పొమ్మనిన - పోరుజరుగునావలననికృష్ణుడు జెరెద్వారవతి
పాదు ॥ తనకుసహాయముకృష్ణునిగైకొనతలచిసుయోధనుడు - ద్వార
వతి - చనుదెంచగనపుడు - పరుండెను - వనజనాభుడతడు - రాజ్యసము -
గనితలదెసనుండెనుసుయోధనుడుకాల్కడుండెనర్జునుడు ॥ తల్కడను
న్నసుయోధనుగానకమేల్కనిముందరనూ - అర్జునిపల్కరించగాను -
మ్రొలనే - తల్కడొచ్చెననెను - సుయోధన - కాల్కడనున్నార్జునుని
మ్రొలనేగాంచితిననియిట్లనెను ॥ గోపాలురపదివేవురనొక్కరుగోరి
డినన్నొకరుఁ - కృష్ణుడన - కోపంబునమీరెఁ - సుయోధను - గోపా
లురగోరెఁ - పాల్గుణుడు - నాపాలికిరంమనియాశ్రీమన్నారాయణు
గోరెఁ ॥ పదివేవురగోపాలురదోట్కొనిబలరామునితోడ - సహా
యము - కదనమునకువేడ - వినిహాలా - యుధుండతనితోడ - సుయోధ
న - యెదియెటుబోతేనేమినూరకుండెదనేరానటుచూడ ॥ అనవ్వుడు సు
యోధనుడాకృతవర్మునిపాలికిజనెను - వకత్యో - హిణిబలంబుతోను -
సహాయము - చనుదెంచెదననెను - వినిసుయో - దనుండునిజపురికరిగెశ
ల్యుడాధర్మజుగనవచ్చిననూ ॥ గనిపాండవులుకృతాంజలులైశల్యునిపూ
జించియును - కాంచనా - సనమునసుంచగనూ - ధర్మనం - దనునకుద

యగనేను - కష్టముల - ననిపియుసుఖులైయున్నారాయనవినిధర్మజుడి ట్లనెనూ ॥ మీదయవల్లనుకుశలంబేమామీదకరుణతోను -నీవ్రమం- మా దరించవలెను - యనినవిని - సాధుశల్యుడనెను - యేమడుగు - కాదనకి చ్చెదనననిశల్యుతో కాలసూనుడిట్లనెను ॥ సారసాక్షుడర్జునునకుసూ తముసల్పనున్నవాడు - కృష్ణుసరి - సారథియీలేడు - జగంబుల - మీరు దక్క లేడు - కర్ణునకు - సారథివీవైనసవ్యసాచినిసారకృపనుగాపా డు ॥ పూర్ణకటాక్షంబునశల్యుడుయముపుత్రునకిట్లనెను - కర్ణునకు - నిర్ణయముగనేను - హీనగురి - కర్ణకఠోరమును - జెప్పుచును - క ర్ణునిసారథి నెనైపార్థుని గాపాడెద నయమునను ॥ నహుషుడు కృతమర్మయముల బిడౌజునతికష్టంబులను - బెట్టైశచి - సహి తంబుగధరను - విధికృతం - బహునిర్జరులకును - దప్పదా - న హుషునికై వడికౌరవనాథుడునాశమొందుననిజనెను ॥ యక్షౌహిణిలు పదుదొకటిగూడెనాసుయోధనునకు - కౌరవుల - శిక్షసేయనిటకు - పాండవుల - కక్షినిమాన్పుటకు - ధర్మజున - కిక్షౌహిణులేడుగూడె పాండవరక్షణంబుకొరకు ॥ సంజయుడాధృతరాష్ట్రునిపనుపునజనిధర్మ జుతోను, - సంధిసే - యంజనుమనితాను -ధర్మజున -కంజలిజేసియును- మొ్రక్కి యా - సంజయుడరుదెంచియుకురుపతితో సారపరాక్రములనె ను ॥ కౌంతేయులుమునుమీసేతలకునుకనలుచున్నవారు - ధర్మమే - సంతసమనువారు - కౌరవకు - లాంతంబనినారు - యుద్ధమూ - పంత్రం బెజయమనిధర్మముకురుపతికిజెల్పుచున్నారు ॥ అనిసంజయుజెప్పిన పాండవులపరాక్రమునదినెంచి - దృతరాష్ట్రు - మనమునజింతించి - భీమసే - నునిలావ్రుదలంచి - సుయోధన - మనముగెల్వరాదీసంగ్రామ ముమానుమనినప్పగాంచి ॥ కృపుడుగురుడసాధ్యబలులునాహవనిఫణు లుండగాను - కర్ణుడే - నుప్పైనుండగాను - పిరికిపాం - డుపుత్రులేవు రును - గెల్తురను - విపరీతోక్తులు మానుముగాజ్యంబేమివారికివననెను॥ మరునాడాపాండుకుమారులుహరిమందిరమునకొచ్చి - పాండవులు - కరములుముకుళించి - వినయమున - పరమాత్ముని గాంచి - మనవివిను - వరదామాజనకుడుమిముజూపియునరిగెననుచుపార్థించి ॥ దేవాదా యాదులతో కలహద్వేషమేలనయ్య - కౌరవుని - కీవుజెప్పవయ్య - కరి

పురం - బీవటుబోవయ్యా - వినవయా - బావాదృతరాష్ట్రునితోమా ప
గభాగమిమ్మనయ్య॥కల్లలాడిపాలివ్వనివారికికఠినపజయమనుము - కృ
పాదుల-నెల్ల జెప్పుమనుము-కడకునై-దూళ్లుయివ్వమనుమూ- కాదనిన-
యెల్లవారికిని జెప్పిరంమ్మ మన మేమిసేయగలము॥పక్షపాతగఠిమాదెస
నుంచుటబాగుగాదు దేవా - ధర్మయుత - మక్షయంబుగావ - నుభయ
లకు - కక్షిమాన్పనీవా - దీనసం -రక్షారమ్మనిపల్కినకృష్ణుడురయము
నకరిపురిపోవ ॥ విదురుండెదురేగియుతాకృష్ణునకింటవిందు జేసి-పాం
డవుల - పదిలముతానరశి - హరినిసం - మ్మదమానసుజేసి-పసుపగా-
కదలినరుగుదెంచినకృష్ణ నకునుఘనమర్యాదలు జేసి ॥ వదరిసుయోధను
డిట్లనెహరితో వాలుదెలియలేక - నీవుమా - సదనమునకురాక - శూ
దృడని - మదినెరెంగలేక - కేశవా - విదురునింటనన్నంబుగుడుచుటది
హితవానెసువివేక ॥ మాయింటికిరాకుండు టేమనినమాధవుడిట్లనె
ను - శౌరినుతి - జేయకనుండినను - హీనజా - తీయుండినవలెను - య
వ్వరగు - నాయెడమదిభక్తియుగలవాడెనవని బ్రంహ్మణుండనెను ॥ న
మ్మినహరిభక్తులదూషణయమనరకప్రాప్తమన్నాను - విదురుడెద - తం
మికంటియనును - నాలవకు - లంమ్మనదగదనెను-శ్మృతీధర -బ్రంహ్మ
జ్ఞానంతుబ్రాహ్మణాయనిపల్కగవినవనెను॥ప్రియమెసగంతగపిలచియ
న్నమునుబెట్టుటలెస్సనెను - నీవుమ-ర్మ్నయమానసమునను మాదెసలే-
ప్రియుడవుగావనెను-యెట్టులన - నయగుణులేవురుపాండుకుమారులు
నాకుప్రాణములుధరను॥పగవారలయన్నంబుగుడుచుటదిపాడిగాదువి
నుము - పాండవుల - పగమదిసంతతము మీకుగల - దుగనుకతగవి
నుము - ప్రాణముల్ - పగగొనువారలబోనముగుడుచుట తగదందురు
నిశ్చయము ॥ ఆకొల్వునవారందరువింజ్జంబాకిడిన తెరంగు-నుండిరచ-
లాకృతినిదొడంగు - కేశవా - లోకనమునెసంగు - నప్పుడుగని - యా
కృష్ణుండనెపాండుకుమారులయరపాలిట్లనొసంగు ॥ బాయనివైరంబే
లావనిసగపాలుయివ్వరాదా - వారుమీ - దాయాదులుగాదా - పాం
డ్డవుల - దాయబాక్కులేదా - సుయోధన - మాయబ్రతుకు లెవరికిశా
శ్వతముమంచినిగనరాదా ॥ నంమినవారిని చెరచుటనీకెది న్యాయము
గాదోయి - మనశేరీ - రంమ్మనిత్యమోయి - కీర్తియే - కంమునిలచునో

యి - వారిపా-లింమనిపల్కె-నవినిసుయోధనుడుతంమికంటివినవోయి ॥
యేనుసూదిమొనమోపినమాత్రంబేనిభూమినివనూ-పాండవుల - కేను
భాగమివను-బట్టినిర్ణ-బోనునుంచెదాను - వారొచ్చిన-సానలేనికత్తులే
మితెగుననిసాహసంబుబూనగనూ ॥అష్టాతురినాముదువిశ్వాకృతినపు
డుదాల్చి తాను-యంధునకు-దృష్టియివ్వగాను-తన్నుగని-దృష్టితీయుమ
నెను-దీసియూ-మష్టశకునిమశ్నాసనాదికృతదుర్బోధలువలదనెనూ॥హ
రికర్నునితనయరదమెక్కుమనియూవలజనియనెను- వారలే-పురకునన్న
వనెను-నృపదసుత-వరించురమ్మనెను-కర్నుడనె- వరదావారలునన్నున
మ్ముకొనివలయుధనంబివ్వగనూ॥ నట్టేటిలోపుట్టిముంచివిడచియుపెట్టి
రాదగూను-యర్జనుడు-గిట్టికేనురాను - నల్వురను-గొట్టుటకునుపోను-
శౌరినీ - విట్టులాడతగదనికర్నుడుతావెళ్లెకృష్ణుడంతటనూ॥ వనజాక్షు
డుచనుదెంచిధర్మజునిగనుగొనియిట్లనెను - సకలధర -జనపతులుండగ
ను - సుయోధను - డనెనుభాగమివను - పొంమనిన -చనుదెంచితిసంగ్రా
మమునగానిచక్కపడడనగవినెను ॥ కడువడిదృష్టద్యుమ్నాదులకు సే
నాధిపత్యమిచ్చి - భేరినిన - దడరుగమూయించ్చి - కౌరవకు-లడవిగొ
ట్టనెంచి - పాండవులు -వెడలెకురుక్షేత్రంబునకుసమరవివాహముగమ
దినెంచి ॥పాండవులాకురుభూమికిరాగనిపల్కెసుయోధనుడు - శాత్ర
వుల - ఖండించెనమిపుడు - యరదముల - దెండివేగమిపుడు - పెనకువ
కు - లేండిలేండిరాండిరాండిపాండవదండమీదికిపుడు ॥దోృణకర్నకృ
పకృతవర్మాదులసేనపతులగాను - జేసితా - సైనీకులతోను - సమర
ముణ - బూనిలేవగాను - భీష్ముడని - యేనీవతిరధుడవునీతమ్ములనెంచ
గసమరధులనెను ॥ మనబోజాగ్రణికృతవర్మశల్యబాహ్లాకులతిరధులు -
లక్షుణశ - కునివినుసమరధులు - దండధా-రణులునర్ధరిధులు - సైంధవు
డు - మొనత్రిగర్తపతులేవురుతోబుట్టువులుమహారధులు ॥ అతిరధోత్త
ముడుదోృణాచార్యుండందునిందులాను - కృపుండతి - రధుడుభాను
సూను - డర్ధరధు - డితడనిదెల్పగను -కర్నువిని మతికోపంబుననదీసు
తునితోనతడిట్లనెరయమునసూ ॥ వీవర్ధరధుండవంటివితక్కవేమిజ్ఞా
చినావు - యర్ధరధు - డీవునేనులావు - కయ్యమున - రావుచూచెదావు-
ఓసినవిని -యూవలభీష్ముడుజెప్పెసుయోధనుకాపాండవులలోలావు ॥

గనయుధిష్టరుండతిరధుడుకవలుగాంగేయుడుసమరధులు - ద్రౌపదీ-తన యులుమహారధులు - యుత్తరుం - డనిలజుడతిరధులు - ఉత్తముఁలు-విను మత్స్యపాంచాలావని-పతులిరువురుమహారధులు ॥వరాతిరధులకుతల ఘటోత్కచుడువాసవసూనజుడు - చేదిభూ - వరశిశుపాలజుడు - మ హారధ - కరులుపాండ్యుడతడు - నధిరధుడు - నరుడీమానముపాడనవశ మేనాజ్ఞివైరిజితకరుడూ ॥ అనిదెల్పినవినిసయోధనుడు భీష్మునిలావడు గగను - నేశిఖం - డినియొక్కనిగనను - యుద్ధమున - ననుజయించరిల ను - భీష్ముడనె - ననిజనమేజయునకు వైశంపాయనుడు దెల్పవినెను ॥ నందందనామంగళమిదెగోవిందసదానంద - సూరిజన - బృందనుత ముకుంద - యిందిరవ - సుంధరధవమంద - రాద్రిధర-సుందరాంగయం మ్మనబోల్లనవందితపదారవింద ॥

కందగీతిగర్భచంపకమాల.

మురహరిపాండవావరదభూధరధారణవాసుదేవతా । మరవి నుతాధిపాపరమమానిజనార్చితపాదపద్మకా । వరకరిరక్షణాగరుడ వాహరమాపతికామరూపకా । తరలకృపామృతీవసుధతల్లెనబోల్లుప్ర రవాసపాలనా ॥

గర్భకందము.

హరిపాండవావరదభూ।ధరధారణవాసుదేవతామరవినుతా । కరిరక్షణాగరుడవా । హరమాపతికామరూపకాతరలకృపా॥

గర్భగీతము.

వరదభూధరధారణవాసుదేవ।పరమమానిజనార్చితపాదపద్మ। గరుడవాహరమాపతికామరూప - వసుధతల్లెనబోల్లుప్రరవాసపాల ॥

గద్య ॥ ఇది శ్రీహరి చరణారవింద మకరంద బిందాస్వాదనిందిందిరాయమా న మానస కంమ్మవంశపయః పారావార రాకా సుధాకర నాగిసేనికృ ష్ణదునాయని తనూభవ తారాశశాంక శ్రీకంఠశౌరిమోహినీవిలాసద్వ యనాటకాలంకార నిర్మాణ యశోదురంధర వెంకటకవీంద్ర ప్ర ణీతంబైన శ్రీమహా భారతార్ణవలఘుబోధిని,

ఆదిపంచకము,

సంపూర్ణము.



శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు.

# శ్రీ భారతార్ణవలఘుబోధిని.

## యుద్ధపంచకముప్రారంభము.

—— :o: ——

హిందూస్తానిమెట్టు - తోహర.

శ్రీరమణీమణిహృదయేశ్వరమునిసేవితకవిలోలా - కోవిదవి-
చారసుగుణశీలా - జలధరా - కారకనకచేలా - జగన్మయ - భూరిద
యాచలధరసమ్మానబ్రోల్పురవరజనపాలా॥ దేవా వైశంపాయనముని
జనమేజయుడడుగగను - మానిజగ - తీవరవినుమనెను - భారతక-థా
వలదెల్పెదను - ధర్మయుత - మీవారలుసంగరవిజయులుయీమేదినిలో
పలను ॥ కురుక్షేత్రంబునరెండుతెరంగులపరిగమివిడిసీయును - ఓం
డారులు - నరుకగదలచియును - పాండవులు - గురుకృపాదులకును -
మ్రొక్కి-కృప - గురులనుజ్ఞగొనిసంగ్రామమునకుకుతుకంబునవచ్చియు
ను ॥ మనమునస్వజనపగాసనంబునకుమరిశంకించియును - క్రీడికృ-
ష్ణునితోనిట్లనెను - కౌరవుల - గనబంధువులనెను - శత్రులని - మనసో
ర్వముజంపుటకుచేతులాడవనినకృష్ణుండనెను ॥ యీవిచారమేటికిరీటి
మనకెక్కడివారనెను - వైరిదయ - భావంబునమాను - జీవునకు-చా
వులేమపూను - విగ్రహాము - భూవిభులకుధర్మంబనికృష్ణుడుపురికొల్పి
నవినితాను ॥ నరుడుశిఖండినిముందిడుకొనిసురనదిసుతుబడనేశన్-తూ
ర్పుతల - శరతల్పునిజేసెన్ - శకునిసో - దరులనువధజేసెన్ - సంశ
ప్త - కరిబలంబుబరిమార్చశౌరినరుడరిగిశౌర్యమునడాసెన్ ॥ అచ్చట
సంశప్తకులతోటినరుడాహవంబుజేయన్ - వెళ్లెనని - హెచ్చుకేకవే
యన్ - సైమవుల్ - దెచ్చిపట్టుటాయన్ - శౌర్యమున - నిచ్చటకౌరవ
సైన్యకులుమహావిరావేశనులామెన్ ॥ బురాన్పురిజరిపాగాల్మెరయ

గశిరంబుననుజుట్టి - తిలకము - ల్మెరయనుదుటబెట్టి - యస్త్రము- ల్కరాబ్జమునబట్టి - తురగముల - కరుణకాంతివస్త్రభూషణంబులు ఖురుసైనీకులుగట్టి ॥ భారద్వాజుడుసంఘటించె,నొకపద్మవ్యూహమును -వివిధదే - శారాట్టశములును - గురుశకుని - భూరిశ్రవసులును - మొగ్గరము - జేరిరివలయాకారంబదిగనిశ్రీశునల్లుడిట్లనెను ॥ కీచకాంతకాపినుమాజనకుడుక్రీడిజెప్పెదీని - సంగతిక - యోచనేలబూని - జయించెద -రాచమూకపైని - ధర్మజుడు - జూచిబాలుడవునిన్నంపుటమది చొరదనపినిబిరుదూని ॥ పురారిబలారిమురారిక్రీడిటువుత్తెంచిననేనూ - జయించెద - సరకుసేయననెను - నరసుతుం - డరిగెవేగమునను - చొచ్చిపటు - బిరానకౌరవమహార్ణవంబునదిరుగుమందరగిరోను ॥ నరుకుమారునరదంబెత్తెరగునదిరగెపౌజులోను - గైదువులు - చురుకుసేయుచూను - లక్ష్మణుని - నురుముసేయగాను - సుయోధను - పరిగమిసౌభద్రునిబొదిపిరిశరపరంపరలుగాను ॥పాండవులభిమన్యునకుదోడుజనపద్మవ్యూహమునా - సైంధవుం - డుండెనడ్డమూన - జొచ్చుటకు - గండిలేదుగాన - సుయోధను - దండొకటైయభిమన్యునిచదిపిరిదయనాశనధర్మమున ॥ ఆసమయంబునవాసవనందనుడాసంశప్తకులా - సదనదము - జేసివచ్చెచాలా - దుఃఖమున - గాసిజెందుకాలా - సుతునిగని - వాసవనందనుడన్నానీవిటువగపుజెందెదవదేలా ॥ అనినసవ్యసాచికినుధర్మజుడభిమన్యుడుసేన - జొచ్చె - మునుజనుటకుబూన - సైంధవుడు - మొనకడ్డముబూన - వారునీ - తనయునియధర్మముననుజంపిరనవినికిరీటికోపమునా ॥ ప్రతిజ్ఞగొనిఫాల్గుణుడుసైంధవునిహతమొనర్చెభూరి - కోపమున - వితతిసేనపోరి - సకలనర - పతులజంపెకోరి - క్రీడిమది-ప్రతాపశీలుండైసుయోధనుసబలముజంపెనటమీరి ॥ యిలావంతుజంపినయలంబిసునిచలమునవధియించెక్ - ఘటోత్కచు - డులాతితతినెంచెక్-శత్రులని - బలంబులణగించెక్ - కోపమున - జలజాప్తసుతుండాఘటోత్కచునిశక్తిగొనివధించెక్ ॥ విరాటద్రుపదులద్రోణుడుగూల్చినవీరావేశమున - భీమసో - దరులుసంగరమునా - ద్రోణుపై - శరములేయబూనిన - ద్రుపదనృప -వరకుమారుడాద్రోణునికంఠముదరిగెనిముషమాత్రమునా ॥ ద్రోణుడుమృతినొందినసుయోధనుడుభానునందనునకు-స

ర్వసే - నానివహంబునకు - నాధిపతి - గాను జేసెరవికు - మారుతన -
సేనలమకరవ్యూహంబునిల్వ జేసెనుబవరంబునకు ॥యింద్రజునకుధర్మ
నందనుండనెవీరయుద్ధమునకు - కర్ణుడొక - సాంద్రసేనకిటుకు - కట్టె
మక - రేంద్రాకృతిమనకు - తెరువేమన - చంద్రవ్యూహవిధానంబుని
ల్పిసవ్యసాచి సేనలకు ॥ ధైర్యముగనుమధ్యప్రదేశమునతానుండినడా
సెన్ - ధర్మజుడు - కార్యంబునదూసెన్ - శరంబులు - దుర్యోధను నే
సెన్ -విరథుడై-శౌర్యహీనుడైసుయోధనుండాశల్యసేనదాసెన్॥పాం
చాలకుమారులరాధేయుడుప్రాణంబులుదీసెన్ - భీముడది - గాంచి
కర్ణునేసెన్ - విశిఖములు - ద్రుంచికర్ణుడేసెన్ - హస్తిగని - పంచా
స్యునిచందమునకర్ణుపైఫాల్గుణుండువడిడాసెన్ ॥ కురుకుమారుల
జన్నునిదాకిధరగూలిరిదుశ్శాస - నుండువడి - నరుగుదెంచిరోష - భీ
ముపై - కరుగజంపెవాస - వతనయుం - డరివృషసేనునివధించెసంగ
రపరమకౌతుకనివాస ॥ సూతతనూభవునకుశల్యుండనెసూరుడజన్
నుండు - సమరవి - ఖ్యాతయుతయశుండు - క్రీడితోకి - రాతుడైశివుం
డు - నోడెనీ - వాతసిగెల్వగలేవనకర్ణుండాగ్రహంబునను మెండు ॥
కుటిలాత్ముడమనపగవారలబహుగొనియాడెదవేలా - శల్యనీ - కుటి
లత్వముదూల - నర్జునుని - తలద్రుంచెదచాల - క్రోధమున - చటులప
రాక్రమయుహిశరంబుగొనశల్యుడగనియిదిమేలా ॥ గాధేయాగురి
గాదనచిత్తముక్రోధమునచలించెన్ -కృష్ణురథ -మాధారుణికుంచెన్-
యజ్జునుని - మీదప్రయోగించెన్ - యహిశరం - బాధనుంజయునిమకు
టముద్రుంచియుక్రోధంబునతిరిగొచ్చెన్ ॥ సర్పముఖశరంబునారుశర
ములసదమదంబుజేసెన్ - క్రీడితా - నేర్పరచియుదూసెన్ - గైదువు
లు - గూర్పుగానుజేసెన్ - కర్ణుపై -దర్పంబునపదిశరంబులనగొనిధ
నుంజయుడువడిజేసెన్ ॥ రాధేయునిరథచక్రముగ్రుంగినరథముడిగిట్ల
నియెన్ - ధరస్తుడ - మీదలేయకనియెన్ - యరదమే - త్తెదతాళు
మనియెన్ - రథస్తుడ - మాధవునకు నీకు వెరచిగాదిదిమంచిధర్మమని
యెన్ ॥ క్రీడిమోలనొగలనుండికృష్ణుండేడధర్మమనెను - మున్నునీ-
కేడపోయెననెను - యీతగవు - నేడబొడమెననెను - పదుగురున్-
గూడిక్రీడిసుతుజంపిననాడిబాడియేడజనెననెను ॥ ధనుంజయాసంది

యంబేలననమనంబుననురోష - వహ్నిఁదరి - కొనంగనరుహోష - మ
హాస్త్రంబు - బును చేకొనిపూషా - న్సుతునితల - దునిమె ఘోరశరమాక
ర్ణునితలదొఁగెరక్తమునభాస ॥ రాధేయునిదలచుచుకురుసైన్యముఁరణ
ముబాసిబరచేఁ - సుయోధను - ఖేదముకృపుజూచేఁ - ద్రౌణిక-ర్ణు
డెల్లసమసెఁ - మాటవిను - మాధవసహాయులతో కయ్యంబికమా
నుమనినకోపించెఁ ॥బలాధిపత్యముశల్యునకిచ్చినబవరంబునగెలుచుఁ-
యనుచుతా - బలికిశల్యుబిలచెఁ - మద్రవిభు - డలఘుఁడొచ్చినిలచెఁ-
సుయోధను -బలాధిపత్యముశల్యునకిచ్చినపాండుసుతులపైకొచెఁ॥వ
నజాక్షుడుధర్మజునిగనుంగొనివచ్చెశల్యుడనెను - మేనమా - మని
మానసమునను - దయవలదు - మనుజపతులకిలను - శాత్రవుల - కనలి
జంపవలయుననినధర్మజుడనఘుటుజేసెదననెను ॥ కురుసైన్యముసమర
మునవెడలెభాసురిశౌర్యంబునను - కరులుకరు - లరదమునరదము
ను - హరులుహరు - లరికార్యంబునను -కలసిరిటు-పరిగమికురుపాం
డవులుకయ్యమునపదునెన్మిదిరోజునను ॥ నకులుడురాధేయునిసూనుల
పైనరదంబునడాసెఁ - భాసురాం -బకములుమూడేసెఁ-వారిఘూ-
టకములుబడవేసెఁ - వీరసా - యకంబులనుచేకొనియుచిత్రసేనాధి
పుప్రాణముదీసెఁ ॥ అన్నచిత్రసేనుండువడినగనెనంతసత్యసేను -
డుసుశర్మ - లన్నవైరితోను - గలసివిర - ధున్నిజేయగాను - ద్రుపదసు
త - గన్నశ్రుతసోముఁరథమెక్కియుకనలిమాద్రసూను ॥ డిరువదిశ
రంబులేసెసత్యసేజీవంబునుదీసెఁ-సుశర్ముం -డరుగుదెంచిడాసెఁ-
యరదమును - నరికిపారవేసెఁ - వెరెయొక - నరదంబెక్కియునకు
లుడుసుశర్మశిరముద్రుంచివేసెఁ ॥ వడముడిశల్యుడుగదాసంగరముబి
డిబడిరావేశఁ - వెనుకకే - డడుగులుజనిదూలెఁ - భీముగద - కడరి
శల్యుసోలెఁ - కృపుడుగని - బడినశల్యుదొట్టుకనిజసేనాజికిపాండవా
గ్రజువెడాలెఁ ॥ తెప్పరిల్లిమద్రేశ్వరుడంతటతేరెక్కియుడాసెఁ - ధ
ర్మజుని - గొప్పశరములేశఁ - వైరులను - చొప్పడగనుజేసెఁ -యప్పు
ఢా - చొప్పుగనివృకోదరుండుభల్లముగుప్పెనుమద్రేశుఁ ॥ యురు
వడిసురథుండాగురుసుతుపైనరదముబరపించెఁ - గురుసుతుం-డరిసు
రథునిగాంచెఁ - బాణమున - సురథునివధియించెఁ - సుయోధను - శ

రపంచకమునదృష్టద్యుమ్నునియురువడిగదదృంచెన్ ॥ పులులచంద
మునశల్యధర్మజులుదలపడిరాలమునా - యొండొరులు - చలంబునను
బూన - ముకుందుడు - గెలువుధర్మసూన- యనినహరి - పలుకులువి
నిశంకింపకధర్మజు డలఘుశౌర్యమునా ॥ భక్తిమీర హరిహరాదుల
నుతనభావమునను తించెన్-ప్రణతుడై - శక్తినిస్మరియించెన్ - గైకొని
యు - నోక్తిగగురిగాంచెన్ - ధర్మజుడు - శక్తిప్రయోగించినయనిశ
ల్యుసిజంపిరక్తమునముంచెన్ ॥ గనిశల్యానుజులుధర్మజునిపైగదియగవ
ధియించెన్ - చూచిశ - ల్యునిచుట్టములాచ్చెన్ - పాండుతుటు - ము
నబిరానజోచ్చెన్ -ధర్మజుడు-మనిమెదుర్విషహప్రభృతికుమారులననిల
జుండువధియించెన్ ॥ ఉలూకుండుచనుదెంచియుసహదేవునిపయికసి
మసగి ॥ నిశితశర - ములనేయగమెలగి - ఉలూకుని - తలదునిమెనుపెన
గి - చూచిసౌ - బలసుతుండుబడకనుగవనశ్రులుబారదుఃఖమునకల
గి ॥ సుగుడశకునిసహదేవునిపైతనమగతనంబుజూప - త్రిశరములు -
నిగుడించినకోప - మునశకుని - సెగతాళియుసలుప - సహదేవుడు - న
గుచునుమాపుంపారకనిలునుంచతనిశరంబులుదాప ॥ మునసుద్రుంచి
కౌరవదుర్నయతతిమూలమనిదలంచి - శకునితల - మనిమెనునుజుగాం
చి - పాండునం - దనులుసంతసించి - రప్పుడుహృతజనశేషులుజనిసు
యోధనునిగనిశకునిచావుసెరిగించి ॥ పుడమిరేడుపనుపునజనిపరిగమిగె
డసెసంగరమును - సుయోధను - విడచివెట్టితాను - వెరచియొక - మ
డువులోపలాను - దాగగసి - వెడలివచ్చిధర్మజుడుసుయోధనుకిట్లనెనిం
మడువునను ॥ సొచ్చియుండమేలెశూరులకిదిహెచ్చుగామలెవ్వు - రా
జులిది - మెచ్చరనుచునమ్ము - చావునకు - నిశ్చయించిరంము-నీసుతుల్-
జచ్చినసీకీబుద్ధెటుబొడమెనురాజరాజలేలెమ్ము ॥ పగగొనిభాగంబివ్వ
కమమ్ములబాధపెట్టలేదా - లక్కయి - ల్లుగలపెట్టలేదా - దాగితే - న
గుబాటునుగాదా - సుయోధన - మగతనంబుగలమీసంబుంటెమాపయి
రారాదా ॥ రమ్మనవినిదుర్యోధనుండుధర్మరాజునకిట్లనెను - నాకు
నర - దంములులేవనెను - కుమారులు - తంములురణమునను - సఖు
సెదా - హంముగొంటిడస్సితిపోటులచెనయినసమరమునను ॥ చ
క్కగనొక్కసికొక్కడువచ్చియుసాహసమునపోరు - డటులగా - కొ

కన్నీరుపైబారు - బడినసే - చాకయునశూరు - డనగమిము - నిక్కమునీతమ్ములనుకేశవునిచక్కడెదననిచారు ॥ గదాఘండితుండై ప్రాపంబుననుకదలివచ్చి తాను - సుయోధను - మదసుభీమసేను - గదలుగొని - కదనరంగమూను - సల్పిరరి -మదగజమునుమదగజముపోరిన టుగదాకౌశలంబునను ॥ యెవ్వరులావనియడిగినకృష్ణుడుకవ్వడికిట్లనెను - సుయోధను - చివ్వకుమిగులనేను - వినియుతా - కవ్వడిహరికనెను - పవనసుతు - డెవ్విధమునగెల్చుననగకృష్ణుడుకవ్వడికిట్లనెను ॥ ప్రతినపట్టిసుర్యోధనూరువులుభంగపరతుననెను - జెప్పమా - రుతపుత్రునకనెను - శాత్రవుల - హతమొనర్చవలెను - యూరువుల -హ్రూతమధర్మమున కపటజూదమున వెతలుబెట్టిరనెను ॥ వడముడిగనకవ్వడిచెయితొడపైసడిగనివడిగాను - భీమసే - నుడుగదవ్రేయగను - సుయోధను - తొడలువిరిగిపడెను - గనిబలదే - వుడుహలాయుధముబూని కోపమునవడముడికిదితగదనెను ॥ నాభిదిగువగదసమరముసేయుటన ధర్మంబుగాదా - యూరువులు - నాభిదిగువగాదా- వీనికిది - యేభూపతిబోధా - ఊరుహ్రూత - మీభీమునకిదిరీతిగాదనినవినికృష్ణుడుబలభద్రా ॥ వినవామైత్రేయునిశాపంబునవిరిగెనుతొడలన్నా-పవననందనునిప్రతిజ్ఞన్నా - యభిమ - న్యునివారలుమొన్నా - యధర్మము - కనలిజంపిరనపినసహించకనుజనెనిజపురిరామన్నా ॥ తొడలువిరిగిపడిసుయోధనుడుహరితోనపుడిట్లనెను - నీపుక - వ్వడికిజెప్పపినెను - పాధుడచే- సడిగనియునుగదను - పాపక -ర్ముడువడముడిబడవైచెను మేల్నడవడిమరమైనాను ॥ నేలపాలుగా జేయనెమిమ్ముల నాలములోపలను - యరదము - న్నెలగృంగగాను - కర్ణునిక్-గూలజేసియూను - యధర్మము - కాలసుతునిబొంకించిగురునిచెక్కడితిరనహరివినెను ॥ చలమునవిషమిడిపాండుకుమారులజంపదలచలేదా - ద్రౌపదిక్-కొలువుకీడ్చలేదా - మీరుసతి-వలువలొల్చలేదా - కుంతీకొడు - కులపదమూడేండ్లడవులలోపలనిలువజేయలేదా ॥ అనిజనికృష్ణుడుగాంధారికినమునసుతదుఃఖమును - మాన్పియ - జననునెకడకుజనెను - కృపుసుయో - ధనునిగనుంగొనెను - దుఃఖపడి -జననాధాభోగములువిడచినేలనుబడకర్మంబనెను ॥ గురుకుమారుడాసుయోధనుగని

నికొంతదిగులుజెంది - క్రంమ్మరను -నరపతిసెలవంది - శాత్రవుల -పరి
గమినిమరొంది - యుండిరిదె - బరిమార్చెదనసినశ్వత్థామకృపాచా
ర్యుండనెకంది ॥ నిదురాసక్తులజంపదలచుటకునీతిగాదుమాను - మని
నవిన - కమరాత్ముడుతాను - పాండవులు - నిదురవోవగాను - గాంచి
ద్రౌ - పదేయులనుదృష్టద్యుమ్నాదులబరిమార్చియుగురుసూను ॥ దరి
వధసంగతికౌరవనాథునకెరుగజేప్పవినెను - గురుసుతుఁ -మరిమరిపో
గడియును - స్వర్గమున - కరిగెకురుపతియును - యిట్టులా - నరపతిదు
ర్యోధనునిప్రాణములునరుగజూచిగురుసూను ॥ దుత్తరగర్భముచేరతు
ననిన ప్రుష్ణండాతనికనెను - వినుముసే - నుత్తరగర్భమును - బ్రోచెద
ను - విత్తునాశనమును - జేయవని - యుత్తరగర్భమురక్షించెనుహరి
యుర్విజనులుమెచ్చగను ॥ ద్రౌపతికుమారతతిహతంబునకు వాపోవగ
జూసి - పాండుసుతు - లాపగతునిడాసి - ద్రోణసుతు -నేపణగగజేసి-
విజయుం - డాపాపాత్మునిపయికోపంబుననతనిపరిభవముజేసి ॥ గు
రుతనయుండనిప్రాణముహరింపజొరకనువిజయుండు - ధర్మభూ- వరు
డుమాద్రిసుతుడు - ద్రోణసుతు - శిరోరత్నముపుడు - బాణమున - బెరి
కిదెచ్చిమణిద్రౌపతికిచ్చెనుభీమసేనుడపుడు ॥ వగపుమానుమనిదెల్పిన
ద్రౌపదివరమణిగనెనపుడు - మనంబున - వగపుమానెనపుడు - ధర్మ
జుకొ -సగగనుమణినపుడు - భక్తిపెం - పుగశిరంబుననుధరించికౌరవ
తగవుమానెనపుడు ॥ మనమునదృతరాష్ట్రదుసుతదుఃఖార్ణవమున
మునుగుచును - యుండెనా - తనిప్రాస్తంబునను - పాండునం - దను
లుకుతుకమునను ॥ యుండెనని - యనుజనమేజయునకువైశంపాయ
నుడుదెల్పవినెను ॥ శాతకుసమదభంగామంగళమిదెగమాధరణిసంగ-
భక్తనుత - పక్షిరాట్తురంగ - పుండరీ - కాక్షమోక్షగంగ - జనకరిపు-
శిక్షసారయమ్మనబ్రోల్పురజనరక్షమోహనాంగ -

కందద్వయ రుక్మవతీకముల విలసిత గర్భకాంచ పదవృత్తం. ౦

సారసనాభాసాధ్యన సారాసరసిజభవ షితసనకసవంద్యా ।
గారవినేత్రాకారవపుకారా కరుణజలనిధి సుగరుడతురంగా । ధారణ

విద్యాదైత్యవధారాధరణికమలధవతనురుచినీలా। వారణరాజావైరి
ని వారావరదజననినిభవరపురవాసా ॥

గర్భప్రథమకందము

సారససాభాసాద్యన। సారాసరసిజభవపితసనకసవంద్యా।
గారవినేత్రాకారవు। కారాకరుణజలనిధిసుగరుడతురంగా॥

గర్భద్వితీయకందము.

ధారణవిద్యాదైత్యవ। ధారాధరణికమలధవతనురుచినీలా। వా
రణరాజావైరిని। వారావరదజననినిభవరపురవాసా॥

గర్భరుక్మవతీవృత్తము.

సారసనాభాసాద్యనసారా। గారవినేత్రాకారవుకారా।
ధారణవిద్యాదైత్యవధారా। వారణరాజావైరినివారా॥

గర్భకమలవిలసితవృత్తము.

సరసిజభవపితసనకసవంద్యా। కరుణజలనిధిసుగరుడతురంగా।
ధరణికమలధవతనురుచినీలా। వరదజననినిభవరపురవాసా॥

గద్య॥ ఇది శ్రీహరిచరణారవిందమకరందబిందాస్వాదనిందిందిరాయమా
న మానస కంమ్మవంశపయఃపారావార రాకా సుధాకర నాగినేనిక్ర
ష్ణమనాయని తనూభవ తారాశశాంక శ్రీకంఠగౌరీమోహినీవిలాసద్వ
యనాటకాలంకార నిర్మాణ యశోధురంధర వెంకటకవీంద్ర ప్ర
ణీతంబైన శ్రీమహాభారతార్ణవలఘుబోధిని,

యుద్ధపంచకము

సంపూర్ణము.

---



శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు.

# శ్రీభారతార్ణవలఘుబోధిని.

## శాంతిత్రయ ప్రారంభము.

—:0:—

హిందూస్తానిమెట్టు - తోహర.

శ్రీకారుణ్యార్ణవశాశ్వితసరసిజభవనుతకామ - జనకలో -
కాకారశ్రీమ - న్దేవనర - పాకారిస్తోమ - చిత్తవిను - లేకోనారాయణ
యంమనబ్రోల్డీనరక్షణభిరామ ॥ దేవా వైశంపాయనునితో జనమే
జయుడిట్లనెను - హేమహా - న్భావాకుతకమును - జెలంగగ -నావల
వినవలెను - దల్పుమనఁ గా వైశంపాయనమునియిట్లనె కయ్యములోప
లను ॥ పమనెనిమిదియక్షౌహిణిల్సనుసిపరము జేరగాను - పోర్లితన-
హృదాబ్జంబునాను - ధార్తరా - ష్ట్రిమఃఖించగాను - గనుంగొని-విదు
రుడనెను ధృతరాష్ట్రిమఃఖావేశంబేలనుమాను ॥ యౌవ్వనంబురూ
పంబుజీవితమద్రవ్యసంచయములు - నిల్వవని - యివ్వమధనుబుధులు-
బంధువులు - చివ్వగూలదిగులు - జెందరిల -నివ్వగ పేలనువలదనయంధు
డువినివిమరునక నెబుధులు ॥ ప్రియాప్రియావస్తురాక పోకకుప్రీతిమఃఖ
ములను - లేకని - శ్చయులైయెటువలెను - యుందురుదె - లియగబ
లుహమనెను - విమరుడా - సుయోధనునిజనకునకిట్లనెబుధసుజ్ఞానంబున
ను ॥ లోకమునిస్సారంబు జేసితమలోన వ్యాకులమును - పొరయరీ - లో
కనడతలకును - లోవడిచి - కాకుజెందరిలను - మఃఖసుఖ - నేకముగా
గాంచెదరుపండితులుమేదినిలోపలను ॥ సంసారముదుఃఖంబని విడచిరి
సన్మార్గులుమునులు - శరీరము - మాంసరుధిరగుములు - భూపతివి-
తంసానిత్యములు - నిల్వవని - హంసస్వరూపుగాంచిశాశ్వితానందము
గందురుఘనులు ॥ మట్టిబొమ్మలాటీజగంబెవుడుపుట్టిగిట్టుచుండు - నీ

సుతుల్ - గిట్టిరనుచు మెండు - దుఃఖమది - బెట్టుకొనకయుండు - మానిసు
ల్ - పుట్టుటగిట్టుటకొరకనిదుఃఖముబోవబల్కె వ్యాసుండు ॥ మానవ
నాథా పుత్రశోకమునుమానివేయుమనెను - యంధుడా - మానిబోధవి
నెను - దుఃఖమును - మానియుమానకను - యావిదురుని - తోనాగాం
ధారినికోడండ్రనుదోట్కొనిరంమనెను ॥ పోలిగలనికిగాంధారివధూ
తతిబిలచుకవిదురుడును - రాగపుత్రులహతంబునకును - సుబలసు
త - విలపింపగగనెను - కృపుడువగ - వలదనిగాంధారికిశోకంబును
బాయునటులజెప్పగను॥ అనుజులతోగూడియుధర్మసుతుండరుగుదెంచ
గాను - వ్యాకులం - బునశపింపబూను - సుబలజను - గనివ్యాసుడు
తాను - ధర్మజుం - డనఘుండజాతశత్రునిపైనీవలుకమానుమనగాను ॥
వాయుసుతుండన్యాయకృతంబుననాతనయునిగూల-జేసెనన - వాయు
సుతుడుచాల - భయంబున - డాయంజనిమ్రొల - వినతుడై - యో
యంమాగాంధారిదేవివినుమూరుభంగముసుచాల ॥ ప్రతినబట్టినీతన
యునిగూల్చితిప్రతిజ్ఞపిడచినను - వృత్తగాగు - క్షితిపతిధర్మమును - గా
దనుచు - మతిమంతులుధరనూ - జెప్పుదురు - సుతుదుఃఖమునకువెతవ
లదనిమారుతసుతామలంతటను॥కుంతిమనుమలదుఃఖముదొప్పదికిమా
దుఃఖమును - మానుమని - యంతయుజెప్పినను - వినకవారంతయు
వగవగను - జనార్దను - డెంతజెప్పినను సుబలరాజసుతసుంతైనామా
నకను ॥ ప్రలాపించెగాంధారిసుయోధనుకళేబరముగాంచి - దుశ్శా
సను - కళేబరమునెంచి - యభిమన్యు - కళేబరముగాంచి - మనంబున
తలచితలచిదుఃఖించెసైంధవునితనువుగాంచిగాంచి ॥ శరతల్పగతుం
డగుభీష్మునిగనిమరిమరిదుఃఖించెక్ - సౌబలుని-శరీరమునుగాంచెక్-
దుఃఖపడి - మురారిదెసగాంచెక్ - దిక్కులే - కరణ్యమునగూలెదవని
కృష్ణునియాగాంధారిశపించెక్ ॥ చిరునగవునగాంధారిశాపమునుశ్రీ
కృష్ణుడువినెను - సుబలసుత - వేరువనుచుజనెను - యంధుడా-వరధర్మ
జుకనెను - బవరమున - పరిగమీసమసినవారెందరనినపాండవాగ్రజుం
డనెను ॥ మెరుకపడ్డవారుత్తమజనములు డెబ్బదియారుకోట్లు - నిరు
వదివేల్ - దరమునదెగిరట్లు -ముక్కిడిమూ-కిరువదినాల్గువేలు-నుము
న్నా - టిరువండ్రనుసమసియుసద్గతినిర్జరపురిజనిరట్లు ॥ అని దెల్పియు

ధర్మనందనుండా సంజయవిదురులను-గాంచిసమ - సినభూపతులకు
ను - భరతకుల - జనితరాజులకును - మీరిపుడు - ఘనముగదహనక్రి
యలుసేయవలెననివారంతటను ॥ వారునుయోధనరాజశల్యదుశ్శా
సనులకువాసి - యగరుక - స్తూరినూనెవోసి - యగ్నిసం - స్కారంబు
నుజేసి - ధౌమ్యుసహా - సారశాంతిపౌష్టికాదిశ్రౌతస్మార్తకర్మలనుజే
సి ॥ కుంతిధర్మజునితోకర్ణుడునాకుమారుండుభాను - వరముచే-కాం
తియుతముగాను - గంటిమీ - కంతపెద్దగాను - యనినవిని-సంతసము
నకర్ణునకువరక్రియసల్పిదర్మసూను ॥ డభిమన్యుఘటోత్కచవిరాటు
లకునటువలెగావించి - కుంతిచి - త్రభానుపార్థివించి - కర్ణుగసె -
నిభయంబునమించి - స్త్రీలకికక - వ్యభిచారరహస్యంబుదాగదనియమ
జుడుశపియించి ॥ మడిసినబాంధవులనుదలంచితామదిలోశోకించి -
రాజునై - పుడమినిపాలించి - యుండ, టే - లడవులకేతెంచి -యుందు
నన - వడముడికవ్వడినకులుండిట్లనెవగపేలన్వధియించి ॥ కలిమిచుట్ట
ములజేర్చునుకలిమియుచెలులనుఘటియించుఁ - శౌర్యుడని - కలిమిచె
ననిపించుఁ సుగుణుడని - పలువురజెప్పించుఁ - రాజులకు-కలిమిబలం
బులుగలిగియుండవలెకాననమునవసియించఁ ॥ తగదనిదెల్పినధర్మనం
దనుడువగపుమానడాయెఁ - ద్రుపదసుత - మగసితోనిట్లనియెఁ-రణం
బున - పగతుగూలిపోయెఁ - ప్రాణపతి - వగపేటికిశాస్త్రవహతంబున
కువసుధనేలుమనియెఁ ॥ తరుణిమాటవినిసపరివారముగనరుగుదెంచి
యూను - సకలభూ - వరసంఘముతోను - శుభవా - సరమునయమ
సూను - డరిభయం - కరులనుజులసంతసమునసింహాసనంబుననుతా
ను ॥ అంతటధర్మజుడాకరిపురపట్టాభిషిక్తుడయ్యెఁ - ద్రౌపదీ-కాంత్త
యుతుండయ్యెఁ - తంములకు - సంతోషంబయ్యెఁ _ ధర్మసుతు-మం
తనమునశ్రీకృష్ణునిదలచుచుమహిపాలుండయ్యెఁ ॥ యొకనాడాభీ
ష్మునిపాలికిజనియుధిష్టరుండడిగెఁ - పూర్వజ-న్మకర్మమెటుతొలగుఁ -
దుష్కృతము - సుకృతంబెటుగలుగుఁ - దెల్పుమన - సకలధర్మనిర
తునకుభీష్ముడాసరణిదెల్పదొణగెఁ ॥ పోత్సాహబలంబునులేకనుమ
దికుత్సాహంబివదూ - క్షేమసం-వత్సరసుఖమివదూ - కర్మమే -వా
త్సల్యానుజనదూ - రాజులకు - మత్సరమునమర్మార్గులజంపకమహిసు

కృతంబలవడదూ ॥ పరమపదముప్రాప్తించెతెరగికనెరుకపరతువిను
ము - ప్రపంచం - బరుగచూపుగనుము - నిల్చునదె - పరిపూర్ణంబ
నుము - బాహ్యానుది - పరాత్పరుండక్షరాక్షరంబులగురుతుదెలియగ
నుము ॥ సంసారమునందుండియునంటకిచరించగావలెను - జలంబున-
హంసరూపువలెను - జీవతతి - హింసమానవలెను - మనంబున - హం
సాహంబణగెచూటేదోనరయుచుండవలెను ॥ యీతడుబీజుడుదేహ
డింద్రియుడువీతమానసుండు - జీవుడని - నీతిబలుక్రచుండు - వేదముల-
చేతకర్మమెండు - నిగుణాణుం - డాతనికిపలేవనిశృత్యర్థంబమరజెప్పుచుం
డు ॥ యుక్తిలేనివారలకీవిద్యనుయొసంగవలదనెను - వసిష్టుడి - యు
క్తిజనకునకును - దెల్పవిని - ముక్తిదారిగనెను - గానమది - భక్తి
యుక్తిగలవారికివ్వమనిపాండవాగ్రజునకనెను ॥ గంగాస్నానముజను
లకల్మషముభంగపరచువినుము - నాకము - పొంగజేయునిజము - శౌరి
పద - సంగతమాఫలము - గల్గుశ్రీ - గంగాప్రభావమును వర్ణింపను
ఘనులకైనదుర్లభము ॥ అన్నదానమునుసేయవలయుతా నెన్నిభంగు
లాను - జ్ఞానులను - సన్నుతించవలెను - దీనులైన - మన్ననొండవలెను-
ధరణిసుర - కన్నెలయెడమాతృభావమునతాగాంచుచుండవలెను ॥ క
ల్లుద్రావుటయునిల్లుగాల్చుటయుకఠినపాపములను - పొందువా - డె
ల్లలోకములను - మాటవడి - గిల్లమూటవలెను - విరతమును - కల్లలాడు
వారికిగర్వితులకుకాలునిపురినిజమనెను ॥ సుజ్ఞానులకేకాకమోక్షమిల
ప్రజ్ఞాళికిలేదు - ముక్తిగురు - సంజ్ఞలేకరాదు - యీశ్వరా - నుజ్ఞలే
కకాదు - సృష్టికల - విజ్ఞానంబునమాయజగత్స్రీమవిడుపకసద్గతిలేమ॥
పార్వతిశివునిగనుంగొనినాథాపరధర్మములను - దెల్పుమన - పార్వతి
కిట్లనెను - గిరిసుతా - సర్వముదెల్పెదను - వినుముసే - సర్వజ్ఞుడనా
యందుప్రపంచముసమసిపుట్టుననెను ॥ భక్తజనులకునుముక్తియొసం
గదభవానివినుమనెను - సతికిపతి - భక్తిముఖ్యమనెను - ధర్మయుత -
ముక్తిగోరవలెను - మానవులు వ్యక్తిగలిగివిద్వాంసులయెడసద్భ
క్తినిలుపవలెను ॥ విష్ణునామమునువినినపఠించినయిహాపరసౌఖ్యమును
గల్గుశ్రీ - కృష్ణునిమహిమలను - గల్గెనిల - కృష్ణుమాయలనెను - భూ
తములు - కృష్ణలీలలీజగత్సర్వమునువిష్ణుమయంబనెను ॥ మహాదేవునిమ

హాత్మ్యంబు దెల్పుమన మాధవుడిట్లనెను -ధర్మజా - యిహపరంబులకును- పరమగుచు - మహిమంబేమనను - భక్తులకు - మహానులభుండని శ్రీకృష్ణుడు శివమహిమ జెప్పెనంతటను ॥ ధర్మరాజునకు సకలధర్మములు నిర్మలముగ జెప్పి - నదీసుతు - మర్మములను విప్పి - రాజకృత - ధర్మములను జెప్పి - శుభాశుభ -కర్మములేలాగునజనించుననకాలసూనునకువొప్పి ॥ శుభాశుభంబులు పూర్వజన్మకృత పుణ్యాపాపములను - గల్గునని- శుభకాలంబునను - నదీసుతు - డుభయులముందటను - పరాత్పరు - డిభరాడ్వరదుని యనుజ్ఞగొని తనువిడచి పరముజనెను ॥ పరలోకగతుండైన భీష్మునకు పాండు రాజసుతులు - చందనా -గరుదారు చయములు- దెచ్చి భూ - సురవరమంత్రములు - సెలంగగ - వరధర్మజుడగ్నిసంస్కారమును గరపినగని మదిదిగులు ॥ జెందినగంగాదేవి దుఃఖమును మందరగిరిధరుడు - మాన్పినీ - నందనుడు సుగతుడు - భీష్ముడు వు - రందరపురికవుడు - జనియెనా - నందముగ నిజనమేజయునకు వైశంపాయనుడనెనపుడు ॥ హస్తిరాడ్వరదమంగళమి దెభవనిస్తరకమలాక్షు - సకలజగ - వస్తుమిశద్రీక్షు - కృపామయ - హస్తమానిపకు - ప్రశస్తా - స్వస్తిప్రదయంమనబోల్పురసుజనస్తుత శ్రీవత్సు ॥

మత్తేభ కంద గర్భితసీసము.

వికరపద్మాధిపవిశ్వసద్విలసిత । కారుణ్యమందార కాము రారి । సుకరిపాలాబ్జజుసూనబాణజనక । గాంగేయ చేలానఘాఙనాప్త । బవరభీమాసురబాహుగర్వితహర । వైకుంఠనారాయణా ముకుంద । యమరరాజార్చితయంమ్మబోల్పురవిధు । మానింద్రసంసేవ్యమాఘ నాంగ ॥ గరుడగమనా ర్తరక్షణపరమపురుష । సత్యచరిత భక్తవరద సాగరకృప । భవహృతబలసోదరసారకవిజననుత । సదమలగుణచయ హృదయచరణకమల ॥

గర్భమత్తేభము.

కరపద్మాధిపవిశ్వసద్విలసితాకారుణ్యమందారకా । కరిపాబ్జజుసూనబాణజనకాగాంగేయచేలానఘా । వరభీమాసురబాహుగర్వితహరా వైకుంఠనారాయణా । మరరాజార్చితయంమబోల్పురవిధూమానింద్రసంసేవ్యమా ॥

గద్యకందము.

గరుడగమనార్తరక్షణ । పరమపురుషసత్యచరితభక్తవరద
సా । గరకృపభవహృతబలసో । దరసారాకవిజననుతసదమలగుణ
చయా ॥

గద్య ॥ ఇది శ్రీహరి చరణారవింద మకరంద బిందాస్వాదనిందిందిరాయమా
న మానస కంమ్మవంశపయః పారావార రాకా సుధాకర నాగి సేనికృ
ష్ణమనాయని తనూభవ తారాశశాంక శ్రీకంఠగౌరీమాహేశవిలాసద్వ
యనాటకాలంకార నిర్మాణ యశోధురంధర వెంకటకవీంద్ర ప్ర
ణీతంబైన శ్రీమహాభారతార్ణవలఘుబోధిని.

శాంతిత్రయము,

సంపూర్ణము.



శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు.

# భారతార్ణవలఘుబోధిని.

## అశ్వమేధపంచకము ప్రారంభము.

—:0:—

హిందూస్తాని మెట్టు - తోహార.

శ్రీవిలసత్కరుణాంతరంగసురుషీహృదాబ్జభృంగ - జగన్నుత-దేవఖగతురంగ - సాధుస - ద్భావమంగళాంగ, త్రివిక్రమ - దేవకీనందనదనుజభంగజననిభపురశ్రీసంగ ॥ దేవా వైశంపాయనమునిజనమేజయునకు దాను - జెప్పెని - ట్లావనిపతితోను - వినుమునీ - కావలకధనేను - దెల్పెదను - భూవల్లభతరుసంచయములసురభూరుహమోయనగాను ॥ ధర్మజుసాత్యవతేయునకనెనుపితామహకర్ణులను - జంపినా - కర్మంబెటుజనును - దెల్పుమన - నిర్మలాత్ముడనెను - నీకుదు - ష్కర్మశంకగలిగినయాగమునసుధర్మమునతొలగుననెను ॥వాసిగాశ్వమేధంబుసేయుమనవగపుమానకాను ॥ బంధుజన- నాశనముకుతాను-ధర్మజుడు - గాసిజెందగాను - కృష్ణుడనె - నిశత్రుజయంబెమోక్షంబిది నిజమజ్ఞానముమానను ॥ చచ్చినవారలకేడ్చినతిరుగావచ్చెదరేవారు - దిగులువడి - తెచ్చెదరేమీరు - రాజ్యము - స్వేచ్ఛలవిడిధారు - ణీసుర-ల్మెచ్చగపరిపాలించుమనినవినివచ్చికాలునికుమారు ॥డతిసంతసమునబుధానుజ్ఞశోభితుడయ్యెనుతాను ॥ ధర్మపా - లితమునుండగాను - క్రీడియ-చ్యుతుగనగొనితాను - దేవనా - మతితత్వజ్ఞానంబుదెల్పుమనమాధవుండునరుతోను ॥ యితిహాసంబొక్కటిగలదది వినువినయమానసమును - గలిగియొక - క్షితిసురవరుధరను - యొక్కసుచ - రితసిద్ధునిగనెను - శిష్యుడై - యతిభక్తితోతన్నాశ్రయించగనుయాసిద్ధుండిట్లనెను॥ మానసశారీరంబులేకమైమంచిచేతలురెండు - ధరాస్థలి - బూనిజే

యయుచుండు - కామగుణ - కాననమునమెందు - చరించుచు - నానా శే
ష్మాదిరోగాబ్ధిలోనలసటబడుచుండు ॥ అశుభాశుభములనైనకర్మఫల
మనుభవించవలెను - త్రిమూర్తుల - వశముగాదువిడను - నరుచేతు-ర్దశ
లపొందవలెను - భక్తియుత - పశుపతిచరణారవిందములపైభక్తినిలు
పవలెను ॥ యోనయశుక్లశోణితములురెండునువెలదిగర్భమునను - పిం
డమై - య్యునుతొంమిదినెలను - శిశువుతా - జననంబొధరను - తొల్లిక
ర్మనుభవమునవర్తించుపరమపదమార్గముదెలియకను ॥ నరులుపుట్టి
గిట్టుచునీలాగునపరమధర్మములను - యెరుంగక - మరవస్తులధరను -
పొందుస-ద్గురువరునెరుగకను-నేనిపుడు-జరామరణములుజెందనిమా
ర్గం బెరుకపరతు ననెను ॥ నిరాకార నిబిడీనిరంధ్రవాది పరముదెలి
యుమనెను - యెరుకచే - గురుతెరుంగుమనెను - తన్నుతా - నరశి
యుండుమనెను - వినుమనిన - పరవస్తువగనిశిష్యుడరుగగురుడదృశ్యు
డైజనెను ॥ అనిశ్రీకృష్ణుండీపరమరహస్యముకవ్వడితోను - జెప్పెము-
న్నునిమిషులకునేను - దెలియబలి - కినరహస్యంబనెను - క్రీడివిను -మన
ఘూనాలవజాతులకిదియెమంచిముక్తియనెను ॥ కృష్ణునమాటలువిని
కవ్వడిశ్రీకృష్ణునకిట్లనెను - కొందరిల - విష్ణుశంకరులను - వేరుగా - ధ్యే
మ్యంబేమనెను - శౌరివిని - విష్ణుబ్రహ్మరుద్రాదులనెప్పుడు వేరుగాయత
గదనెను ॥ మృతజాతపరిక్షితునిలబ్ధజీవితుజేసినహరిని - మహాత్ముల-
మతిసవాసఘనుని - కేశవుని - సతిరుక్మిణిధవుని - వాసుతుని - బ్రతికిం
చితివనెను ర్తరకృష్ణునిబ్రస్తుతించెనెమ్మదిని ॥ యివ్వసుఘనభవనాశనము
నకై వినయభావమునను - ధర్మజుడు - కవ్వడికృష్ణులను - గనుంగొని -
దవ్వుననిట్లనెను - మనమికను - ముల్వెల్పులకానందముగనుయాగమును
సేయవలెను ॥ అనియజ్ఞాశ్వంబువెంటకిరీటినసుపగనరిగియును - సి
ద్ధుఘూ - జనపతులడ్డమును - రాగవా - రినిజయించిధరను-ప్రదక్షిణ-
మునసుద్ధిరిగియును రాగబభ్రువాహనుండుతనపురమునను ॥ తురగంబు
నకర్జనునకునెదురుగనరుగుదెంచిడాసి - జనకుడని - యెరుకలేకవా
షి - శరంబుల - నిరుమూడునుదూసి - పార్థునిపై - శరవర్షముగు
రిపించెశూరుడై యురుగైదువులేసి ॥ అతులశూరుడాబభ్రువాహ
నుచెక్షితినిసవ్యసాచి ॥ మూర్ఛవడ - నతనిగనివులూచి -చిత్రాంగద-

సతులిర్వురుజూచి - నాథుడని - సతిసంజీవనిమణి చేపాథుఁడని బ్రతికిం చెనులూచి ॥ సకలరాజులనుజయించి పాథుఁడుమఖాశ్వంబుతోను - హస్తిపుర - ముకువడిరాగాను - ధర్మజుడు - ప్రకటితంబుగాను - సకల జను - లకుసంతోషకరంబుగాశ్వమేధంబు జేసియమసూను ॥ దతిభక్తి తొధృతరాష్ట్రనకునుకాంధారికిప్రియమునను - యనుదినం - బతుల భోగములను - జేయుచు - న్నతరిసుఖంబులను - పొందుచును - దృత రాష్ట్రుడుధర్మజునిగనుంగొని యతనితోనిట్లనెను ॥ సుతులుసమర మునపోరినీగ్గిసద్గతికిపోయినారు - కృష్ణనను -మఱిదప్పనివారు - మీరు సు - వ్రతముజెసనారు - నాదుసం - మ్మతికిహితంబుగ గాంధారిదినక న్నడవికంపవలెమీరు ॥ అనినవినియుధర్మజుడంధునకనెనడవికినిన్నిఫు డు - బోవుమన - మనసొర్వదువినుడు - నివెమా - జననిజనకులిపుడు- నీమనం - బునతాపముమానగశిశూ్రషతమొనరింతననపుడు ॥ వి నిధృతరాష్ట్రుడుతపముసల్పవనమునకు జేరవలెను - యనియుతా -నును గాంధారియును - జేరిరట - వనప్రదేశమును - బోవలవ - దని జేప్పిన విదురుడుకుంతిసోదర్యానుజనెవనమునను ॥ విదురుడుయోగంబునశ రీరమునువిడచిధర్మసుతుని -తనువుసొ - చ్చెమరుగానుధరణి - సుజ నుడా - విదురుచిత్రముగని - ధర్మజుడు -తదనంతరమునవిదురుతనువ నలదహనమొనర్చెనుగతుని ॥ వనమునదృతరాష్ట్రాదులనిర్యాణము నారదమూని - వరుడు జె - ప్పనసుఖ్యముబూని - ధర్మజుడు - జని వారికిమాని - తంబుగవి - పినమునసంధునకతనిసతికిగొంతికిపరకర్మ లుబూని ॥ జేసిధర్మజుడుద్వాదశదినమునభూసురోత్తములకు - దాన ములు - జేసిగజపురముకు - వచ్చెసిం - హాసనరత్నముకు - ధర్మజు డు - వాసిగముప్పదినై దేండ్లునుభూవలయమేలె ప్రజకు ॥ సంతసమున నిట్లుండగనచ్చటసర్వయాదవులకు - నాశనము - జెంతను జేరుటకు - ద్వారకా - ద్యాంతంమునుగుటకు - ద్వారకలో - వింతమహోత్పా తంబులనేకముహెచ్చెనుయదువులకు॥ మునిశాపలబునసాంబునికదువు నముసలముజనియించెఁ - యొకరికొక - రునుపోరుటహెచ్చెఁ-య్య దువులను - జనులెల్లనశించఁ - హలాయుధు - డునుశరీరమునువిడ చియనంతునితనునందుగలసెఁ ॥ పాకటముగకాననమునకృష్ణుడు

పవ్వళించెనొకడు - పేటకా - డాకృష్ణునియపుడు - వ్యాగంబని - చే
కొనిశరమపుడు - వేయగా - శ్రీకృష్ణుడుశౌరీ ముపిడిచియు జేరెపర
మపదమపుడు ॥ కలయవనంబునరామకృష్ణులనుకడువడి వెతకుచును -
రామకృ - ష్ణులశరీరములను - క్రీడిగని - విలపించియునతను-రామకృ-
ష్ణులకునగ్నిసంస్కారముగరపెనుయుత్తమకర్మలను ॥ యాదవపు
రమునకొచ్చిపదార్వేల్యంగనాగణులను - రామదా - మోదరుదా
రలను - సకలమగు - యాదవజనములను - వెంటగొని - యాధనుంజ
యుడు వెడలిచనిరెనినదపుడుపూర్వనగమునను ॥ సారారుణకాంతు
లతోబొడమెనాసమయకాలమునను - పొంగిఘూం - కారనినదముల
ను - సరిత్పతి - ద్వారకాపురమును - ముంపగ - భూరిజనులుగని
రద్భుతసరపూరోర్ణవంబునంతటను ॥ పంచవడంమునపాల్గుణుండు
విడియించినవనితలను - ధనంబును - గాంచిబోయకలను- జేసిదొంగ-
లించుకవెళ్లగను - యాదవ - మించుబోణులనుకురుక్షేత్రమునకుమె
ల్లగగొనిచనెను ॥ అవిజయుడు బలరామకృష్ణనిర్యాణమునిజము
గను - జెల్పవిని - భావములోపలను - మఃఖపడె - కేవలభక్తిగను-రుక్మి
ణీ - దేవీమొదలగుసతులువహ్నిప్రవేశంబైరంతటను ॥ నరుడచ్చుతరా
మాదులసంగతినజాతశత్రునకు - జెప్పవిని - కరిపురపాలనకు - తగ
యుధి - ష్ఠరుడుపరిక్షితుకు - కురుభూ-నరపతియధికారంబునొసంగిరి
యాపరిక్షితునకు ॥ శుభము గలుగ దీవించిపాండుసుతు లిభపు
రంబుబాసి - పోవనొ - కర్ - భైరవముజూసి - వారివెను - కధిచరము
గడాసి - రాగవా - రుభయులువెడలిరివనమాగణంబున యోగమాన
సముజేసి ॥ ద్రుపదపుత్రిసహదేవుడునకులుండునరుండనుధరను-ప్రా
ణమెడ - లిపడగగనుగొనెను - పవనసుతు - డపుడన్నతోననెను - ధ
ర్మజా - ద్రుపదజసహదేవుడునకులుడునరుడీపుడుబడుటకేమనెను ॥ అ
నినధర్మజుడువినిభీమునితోనప్పుడిట్టులనెను- ద్రౌపది -మనమునరుదె
సను - పక్షపా - తినిదాననుబడెను - సహదేవుడు - తనకంటెప్రా
జ్ఞుండులేడనుచుదలచుదానబడెను ॥ చక్కదనంబున తనకంటెవ్వా
రుమిక్కిలిలేరనుచు - నకులుడే - నెక్కువన్నుచుదలచు - దానబడె -
నక్కరుతతిగెలచు - వాడనే - నొక్కదినంబనిప్రతినభంగముననక్క

వ్వడిట డెననుచు॥ వినబలికె నవినివడముడియును బడగను గొని ధర్మజుడు -
వానికొక - టిని జెప్పకనతడు - పోవగా - ననిమిషపతియపుడు - రథం
బును - గొనిధర్మజు నెదురొచ్చి యరదమెక్కు మనినవిని ధర్మజుడు ॥ తో
డంబుట్టువులందరుబడెనాతోడనురావింపు - ద్రౌపదిని - గూడారా
వింపు - వారునన్ - గూడుటగాపింపు - నానిపలిని - నేడు స్వర్గమున జే
రిరద్రౌపదినీతంములునాలింపు ॥ మనినబిడౌజునకిట్లనె ధర్మకుమారు
డాశ్రయించెన్ - కుక్కనా - వెనుకనుచను డెంచెన్ - రావలయు - న
నయింద్రుడు గాంచెన్ - ధర్మజా - మనుజభావమునుకుక్కలకిల నే
మాటికి గలుగుమదినెంచక॥ కుక్కలకును నాకంబు దొరకుటదియెక్కడి
మాటనెను - నీవురథ - మెక్కుమనినపినెను - ధర్మజుడు - కుక్క విడు
వననెను - ధర్ముడా - చక్కని ధర్మంబునకు మెచ్చి యాకుక్క రూపువి
డచియును ॥ ధర్మనందనా నీసమానులీధరణిలోన లేరు - నీవు సద్ధర్మసు
గుణసారు - డవుని - ధర్మకథలుధారు - ణిస్తుతిని - నిర్మలముగ పూ
జ్యంబవునని తా ధర్మనందను నిచారు ॥ యిందంబుననిడకొనియింద్రా
-దులునభినందింపుచును - స్వర్గమున - కరిగికుతుకమునను - ధర్మజుడు -
పరమసుఖంబులను - పొందిసోదరాదిగురుల గాంచిననిమిషత్వంబు జెం
దెనని ధరనూ॥ జనమేజయునకు వైశంపాయనమునివరుడీకథను - జెప్పెన
ని - యునీచరితములను - సజ్జనుల - కునానందముగను - కంమకుల - జు
నికృష్ణనాయునికు పారుడనఘుడు వేంకటనాముడను ॥ భారతార్ణవం
బిదులుకి విజనభారమనుచు దెలసి - శౌరికృప - సారబలము జేసి - నాడ
సిది - కూరిమితో వ్రాసె - పఠించిన - వారి కాయురారోగ్యములొసం
గువనజాక్షుడు కృపజూసి॥ అందముగనుయీకృతిశ్రీహరి పేరందముగ
ను వెలయు - దివాకర - చందరులీకలియు - గమునని౦ - పొందజేయవ
లయు - జనులకా - నందమన్మథాబ్దసహాశుక్ల ద్వాదియాదిగావనిన్ వె
లయు ॥ శ్రీసతినాథా మంగళమి దెయాశ్రితమనుజోల్లాస - మాయక్ప
త - భాసవశవిలాస - కల్పితా - శేషజగత్పోష - సాధుస - ద్దాసవ
రదకేశవధారుణివరతల్లైనబోల్లుర వాసా ॥

కల్పిత కల్పవల్లి భాస్కర విలసిత వృత్తము.

సారసభవనుతసద్గుణసారా । సారసనయనవిజలనిధిశూరా ।

దారుణరిపుమురదైత్యవధారా । ధారుణిసుకమలధవభవదూరా । గౌరవిబుభవమకారవుకారా । కారణవరవిధిఖలజనఘోరా । భూరిదయజననిబోల్పురభూరా । భూరుహసురతరుపురుషవుదారా ॥

గర్భ ప్రథమ కందము.

సారసభవనుతసద్గుణ । సారా సారసనయనవిజలనిధిశూరా ।
దారుణరిపుమురదైత్యవ । ధారాధారుణిసుకమలధవభవదూరా॥

గర్భ ద్వితియ్య కందము.

గౌరవిబుభవమకారవు । కారాకారణవరవిధిఖలజనఘోరా ।
భూరదయజననిబోల్పుర । భూరాభూరుహసురతరుపురుషవుదారా॥

గర్భి ద్విపద.

సారసభవనుత - సద్గుణసారా - సారసనయనవిజలనిధిశూర - దారుణరిపుమురదైత్యవధారా - ధారుణిసుకమలదవభవదూరా - గౌరవిబుభమ - కారవుకారా - కారణవరవిధిఖలజనఘోరా - భూరిదయజనని - బోల్పురభూరా - భూరుహసురనుతపురుషవుదార -

లాలి పాట.

సారసభవనుత - సద్గుణసారా - సారసనయనవి - జలనిధిశూరా - దారుణరిపుమురదైత్యవధారా - ధారుణిసుకమల-ధవభవదూరా ॥లాలి॥ గౌరవిబుభవమ - కారవుకారా - కారణవరవిధి-ఖలజనఘోరా - భూరిదయజనని - బోల్పురభూరా - భూరుహసురతరు-పురుషవుదారా ॥లాలి॥

అర్థచంద్రికలు.

సారసభవనుతసద్గుణసారుఁ । సారసనయనవిజలనిధిశూరుఁ ।
ధారుణరిపుమురదైత్యవధారుఁ । ధారుణిసుకమలదైత్యవధారుఁ ।
గౌరవిబుభవమకారవుకారుఁ । కారణవరవిధిఖలజనఘోరుఁ । భూరిదయజననిబోల్పురభూరుఁ । భూరుహసురతరుపురుషవుదారుఁ ॥

పెండ్లిపాట ॥ లక్ష్మీకళ్యాణవైభావమె.

సారసభవనుత - సద్గుణసారా - సారసనయనవి - జలనిధిశూరా - దారుణరిపుమురదైత్యవధారా - ధారుణిసుకమలధవభదూవ

రా ॥లక్ష్మీకల్యా॥ గౌరవిబుభవమ - కారవుకారా - కారణవరవిధి-ఖిలజనఘూరా - భూరిదయజనని । బోప్పిల్పురభూరా । భూరుహాసురత్రుపురుషవుదారా ॥లక్ష్మీకల్యా॥

శ్రీ ప ళ ము.

సారసభవసుతసద్గుణ । సారాసారసనయనవి । దారుణరిపుమురదైత్యవ । ధారాధారుణిసుకమల - గౌరవిబుభవమకారవు - కారాకారణవరవిధి । భూరిదయజననిబోప్పిల్పురఘూరాభూరుహాసురతరు ॥

సు వా ్వ ల పా ట.

సారసభవనుత - సద్గుణసారా - సారసనయనవిజలనిధిఘూరా । దారుణరిపుమురదైత్యవధారా । ధారుణిసుకమలధవభవదూరా ॥సువ్విసువ్వాలే॥ గౌరవిబుభవమ । కారవుకారా । కారణవరవిధిఖిలజనఘూరా । భూరిదయజనని।బోప్పిల్పురభూరా। భూరుహాసురతరుపురుషవుదారా ॥సువ్విసువ్వాలే॥

గద్య ॥ ఇది శ్రీహరిచరణారవింద మకరంద బిందాస్వాదనిందిందిరాయమాన మానస కంబ్మవంశపయః పారావార రాకా సుధాకర నాగినేనికృష్ణనాయని తనూభవ తారాశశాంక శ్రీకంఠగౌరిమహాహాసవిలాసద్వ్యయనాటకాలంకార నిర్మాణ యశోధురంధర వెంకటకవీంద్ర ప్రణీతంబైన శ్రీమహాభారతార్ణవలఘుబోధిని,

అశ్వమేధపంచకము,

సంపూర్ణము.